# తెనుగు తోట

రాయప్రోలు
సుబ్బారావు

△

నవ్య సాహిత్య పరిషత్తు
△ గుంటూరు △

# తెనుగుతోట

## ఆవాహన

మధుర మధుమాస సాంధ్యయామములలోన
ఇసుక పడకల బడి యిం పయి ప్రవహించు
ఏటివంచల దిరుగాడ నిచ్చగింతో?
దివ్య మగు మల్లెపూల పందిళ్ల పజ్జ
చీర యొడి బట్టి మొగ్గలు చిదుపు చిన్ని
కన్నియల ముద్దునడకల గాంక్షపడెదో?

మండు టెండల నావులు మ్రానినీడ
మోము లెత్తుక రోమంథముల నొనర్ప;
కొమ్మపై నిల్చి పిల్లనగ్రోవి నూదు
గొల్లచిన్నవానిని జూడ నుల్లసింతో?

పరువపు జిగుళ్లు నిండారు వటమహీజ
సాంద్ర శాఖల శీతలచ్ఛాయ క్రింద
స్విన్ననయనము లలసత చివురువోయ
నిలచిన కురంగకన్య ముద్దులను వలతో?

# తెనుగుతోట

నిత్యవర్చస్వినీ! లేఖినీ! త్వదీయ
చిరరహస్య సంకల్పమ్ము లెఱుగ లేను.

కన్నె మెడలకు బూసిన గంద మట్లు
సొన తొరగి చాఱ లయిన రుచుల్ సెలంగె,
పండుచివురులు కాసులదండ లయ్యె
గొమ్మలకు మోహాఋతు లాంఛనమ్ము లెసఁగ;

మంజులధ్వన్యనురంజిత కుంజకులము
అభినవానంద మధుమనోహర లతాంత
ములను నవనవలాడు నో ముద్దుకలమ!

కవిసికొను ననుకూల వాయువుల కేల
కంచె లడ్డములై విభంగము లొనర్చు?

వ్రతు లయిన మాధుకర కుమారకుల మీద
సరిపడనిపూల్ విసర వనస్పతుల కేల

పెండ్లి పాటలు పాడెను భృంగపుత్రి
నేమిటికి ముద్దిడవు లేఖినీమతల్లి!

## గీతాసఖి

వ్రాలు స్వచ్ఛంద గగనతోరణము క్రింద
కాంతి రేణుపుంజములు జగాన గురియ
లసదభిజ్ఞాన తరువులు పసరు వోయు
సహృదయానంద కళ్యాణ విహృతికొఱకు
పాడవమ్మ గీతాసఖీ ! భావపదము !

లేఖినీ సర్వతోముఖ శాఖ లంది
ప్రేమపల్లవ స్ఫురదభిరామ వగుచు
పాడవమ్మ గీతాసఖీ ! భావపదము.

ఇసుకపొరలు చీల్చుచు పొంగు లెసగ బొరలు
పొడుపుటేళ్ళు త్రుళ్ళింత లాడెడు విధాన
పాడవమ్మ గీతాసఖీ ! భావపదము.

పైటజాఱి సిగ్గెఱుగని పల్లెపడుచు
కోయిలకు మాఱు కూసెడి గొల్లపిల్ల
అణఁగి తులసికి మ్రొక్కు బ్రాహ్మణ కుమారి
బ్రమసి వల పెత్తి యాలింప పచ్చి ఫణితి
పాడవమ్మ గీతాసఖీ ! భావపదము.

రుధిరకణ పూత మైన వీరుని కరంబు
ప్రణయ గంధ రంజిత మైన రసికు పాణి
స్మృతి హితాంజలు లిచ్చెడి సీమలందు
పాడవమ్మ గీత్రాసఖి! భావపదము.

ద్రోహమున నల్లబడిన యస్థులభరంబు
ప్రేమచే ధౌత మయిన సాధ్వీనఖాళి
రత్నగర్భ దాచిన గుప్తరంగములను.
పాడవమ్మ గీతాసఖి! భావపదము.

తెగిన తంతుల మఱల బంధింప నేల
నిలిచియున్న యేకశ్రుతిని సవరించి
వేడుకయు వేదనయు రసవిదులు మురియ
పాడవమ్మ గీతాసఖి! భావపదము.

గాఢ నిద్రోపవాస శుష్కమ్ము లయిన
కాళరాత్రుల దుఃఖసాగరము దాట
జుక్కలై నను నా త్రోవ జూపనపుడు
దాన మొవ డిచ్చె చుక్కాని లేని నావ
పాడవమ్మ గీతాసఖి! భావపదము.

వగపు లను రావిమొలక లెదిగిన కొలది
చిత్రభిత్తిక లెటువలె జిటిలి విచ్చె
బాల్యదశలె యెడారులవలెను మఱుగ
వెత గళాసించి కుతుక మేగతి గృశించె
పాడవమ్మ గీతాసఖీ! భావపదము.

## మంగళాచరణము

ప్రొద్దుపొడుపు నోములు నోమ బూనినావా?
చిట్టిబొట్టు కుంకుమ బెట్టు చిన్నదాన !
ధవళకీర్తిదుకూల సుందరము లయిన
యాసలు పిఱుందు లంటు సోయగ మ దేమొ!
కడల నెల్ల నాకర్షించి కనులు గుట్టు.
తెనుగు మీఱిన గరువంపు దీరు లేల?

క్రాలు గనుల కాటుక నిగారంపు బసల
మోహపెట్టుచు నున్నావు ముగ్ధజనుల,
పడుచుదనపు సింగారంపు బెడగుసిరుల.
వలచి వలపించు చున్నావు వయసుకాండ్ర,

పరమవాత్సల్య దృష్టులు మరులు గొలుప
బ్రేమకలితాంధులై రెల్ల వృద్ధజనులు.
ఏమిటికి నీయుదయ కేళి యిగురుబోణి !
గిలుకు టొడ్డాణ మింత బిగించి తేల?

EVK

కవిత
తెలుగు

A. సుబ్బారావు, రాయప్రోలు
తెనుగు తోట

ఆంధ్రగ్రంథాలయ ప్రెస్: బెజవాడ

1939

22 | 8

ఆఱె యాఱని యార్ద్రనీలాలకములు
మెడల బొరలాడ పాయలు ముడువ వేల?
నగవుపూదండ లెట్టి కాన్కలు? కుమారి!
ఎచటి కేగెదు? నోముపే రేమి? తల్లి!
ఎవ రధిష్ఠానదైవము? వృత్త మెద్ది?
తీయని తెనుంగుమాటల దెలుప వమ్మ?
కన్నె వయిన తెనుగునాటి చిన్నదాన!

అనుచు నను బల్కరించె శుభాంగు డొకడు
ముగ్ధుడయ్యెను సోదరమోహ వశత
మధురసల్లాప కౌతుక గ్రథితుడగుచు,
మాటలాడంగ నెంతయో మనసుపడిన
సోదరుని జూచి చూడని చూడ్కి జూచి
విని వినని యట్లు తొలిసందె చనితి నవల;

ధరణిని ద్వితీయవిఘ్నముల్ తగ వటంచు
నోము బట్టించిన జనయిత్రీమతల్లి
శిరసు మూర్కొని మొదల వచించె; నల్లె
శుక్రవారోదయముల నుపక్రమించి

శన్యూషస్సుల దిలకలాంఛనము లీయ
బోయితిని జన్మపూరుపభూములందు:

అడిగె గ్రమ్మఱ మఱునాడు నట్లె యతడు;
నాడు గూడ నించుక పూతనవ్వు నవ్వి
కన్నె కక్షుత్త లిచ్చుచు గదలిపోతి;
అల తృతీయదినారంభ మందు మఱల
వ్రతహితాచార సరణి తప్పకయ యుండ
బయలు దేఱితి నానందనియతితోడ,
తోడిచెలియ యొకర్తె కౌతుకము పొరల
పాటబాడెను ననుజూచి ప్రమదమునను,

నవనవానందవర్ష తాండవవిలాస
మధుర మధురంబ యగుట నా మంజుగీతి
నాలకించితి నించుక యాలసించి;

చూడవచ్చిన ప్రాయంపుజేడె లెల్ల,
పిలువబోయిన తొలికారు చెలువ లెల్ల
స్వాగత నయాభిముఖ మైన పాటబాడి

నను పిలిచి యుత్సవించి రానాడు చెలిమి;
వ్రతకుమారిక నను శుభప్రణయముననో?

ఆ ప్రసన్నమతిమతల్లు, లర్థి నిచ్చు
ఆదరింపుల కై సేత లంది, నేను
పసపు బూసి, కుంకుమరేఖ నొసల బెట్టి,
నోము నుద్యాపనమునకు నామతించి.
వెను మఱలితిని; ఇంతలో ననుజుడతడు
నను పిలిచి పల్కరించె వెన్కటి వితాన;

సందియమ్మున నాందోళచకితు డయిన
సోదరుని గాంచి యి ట్లంటి సూనసూక్తి,
మృదుమృదు శిరీషసుభగసంపదలు వొదల;
హృదయసుప్త సౌహృదములు నిదుర వదల;

నాయనుంగు సోదరమణీ! నవ్యభాగ!
ఆలకింపుము బాలరసాలశాఖ
నుయ్యెలల నూగుచు మరంద లియ్యఘణితి
బాడుచున్నది కోయిలపాటకత్తె
పావనం బైనమాతృసేవాపదంబో

# తెనుగుతోట

౧

నిదుర నెలతలు వచ్చిరి నిదుర లేప,
భద్రభామలు దరిసిరి పాట బాడ,
తెలియరాని చక్కిలిగింత లలమ నోడల
మేలుకొలిపెడు పవనుడు బాలుడట్లు;
నవకపు టుషస్సు చిద్రుపలు కవిసికొనెడు
పొడుపుమలపైకి నూగెడు ప్రొద్దుపాప.
నుయ్యెలల పైడిత్రాళ్ళన నొదిగి యొదిగి;
రాలు సురపొన్నపూవులు రాసులట్లు,
మధువు చిందుచున్నది సుకుమార లతల,
కొమ్మ లొక క్రొత్తరుచి సరసమ్ము లయ్యె;
వృద్ధతరులు లేమొకల పెంపు జూచి
యభినవ వికాస దీపన మభినయించు;
తిన్ననిపథంబు బట్టె యాత్రిక జనంబు
లేచి రా వమ్మ ! మా తల్లి ! లేచి రమ్ము

౨

మబ్బులే లేవు చూడు! విమానవీథి,
ఆశ లాకూతసీమల నంట నల్లె!
తేటి యున్నది జీవనపూర మెల్ల,
క్రమ్మి యున్నది నూత్న రాగమ్ము భువిని,
క్రొత్త మంగళతోరణాల్ గునిసియాడ
కోకిలకుమార మంగళోక్తులు ధ్వనించె;
లలితపల్లవ లక్ష్మి తాండవము లాడ,
పసపు బూపిండి కడ లెల్ల విసరుచుండ
నవనవ కౌతూహల ప్రసూనములు పూచె;
చీకటి ముసుంగు ద్రోసి హసించుచున్న
దదిగో! మంచుల తెరలకు నవల నిలిచి
యొక పవిత్ర తేజోబింబ ముజ్జ్వలముగ;
చూడ బోవుచు నున్నారు తోడి చెలులు,
ఆలసించిన నిలువరు హర్ష వశలు,
ముందుబోయిన నంద రో సుందరాంగి!
లేచి రా వమ్మ! మా తల్లి! లేచి రమ్ము!

3

క్రొత్తగా బెండ్లి యైన లేగుబ్బెతలును,
నిన్న మొన్న నీడేరిన కన్నియలును,
పరికిణీ లింక విడువని బాలికలును,
గడుసునెఱజాణ లగు ప్రోడ పడతుకలును,
కలరు కలరు వారలలోన గన్నతల్లి!
వేఱు వేఱు తోటల కేగు వార లయిన
కలికి! యెఱుగనివారలు గారు నీకు;
దశదిశల నంట బ్రాకవే తరుణశాఖ
లెనసి యొక తరువునకు బుట్టినవ యేని;
పూచు పూవుల గుత్తులై కాచుపండ్ల
గర్భబాంధవ్య సామ్యముల్ గానబడవె?
భయపడంబోకు, ముందంజ బాయ జనదు,
తోడి బిడ్డల సావాస మీడ దగదు,
వినబడు నుషఃకలాపకీర్తనలె కడల,
పొడుచుచుండె తేజఃకళాపుంజ మెదుర
లేచి రా వమ్మ! మాతల్లి! లేచి రమ్ము!

౪

మేలుకొలుపులు మెల మెల్ల నాలకించి
నిదుర లేచిరి నీసాటి నెలత లెల్ల;
కంటికిని మింటికిని సూత్రకాండ మట్టు
లఖిల భూగోళ బహిరంతరాళ నిబిడ
మయిన యొకకాంతి వారల నలమికొనియె;
వింత వింతలు సుమ్మి! యా కాంతి రుచులు;
మండుచున్నవి యొకట ప్రచండముగను
అణగియున్నవి యొకచోట నబ్ధిమాద్రి,
కించి దుష్ణప్రభల నింపు గెరలు నొకట
వెన్నెలలె పండుచున్నవి వేఱుచోట
భిన్న మైన ఏతత్కాంతి బింబ కలల
జూచుచున్నారు విభ్రమచోద్యములను;
పోవ నుంకింతు రా పుణ్యమూర్తి కడకు,
తల్లిబిడ్డల భావబంధములు పెనగ
లేచి రా వమ్మ! మాతల్లి! లేచి రమ్ము!

## తెనుగుతోట

౫

తల్లిపాల్ ద్రావకుండ బందాలబడిన
వత్సములు లాగులాడెడు పాలకొఱకు
ఆలకొట్టాల. పెండెము లవల నెట్టి
మెడలవేసిన పలుపులు విడువ రమ్మ.
తల్లిపాలు ద్రావిన మహోత్సాహపూర్తి
బెనగి చెల్లాట లాడెడు పెంపు మిగుల
నిరుగు పొరుగు లేగల క్రీడ లరయ వమ్మ!
బువ్వదుత్త నెత్తిన బెట్టి నవ్వుకనుల
రవిక దొడుగని గొల్లకుఱ్ఱది యొకర్తు
పోవుచున్నది పొందైన ముద్దునడల,
కలికి యొడిసెల వలెవాటుగాగ దాల్చి
పిఱుదు లసియాడ జీర రాపిళ్ళు పెరయు
కాపుగూతురు పొలములు కావ నేగు
చిన్ని బంగారు పూసల చెండ్లవంటి
జొన్నకంకులు పండిన సొగసుచేల
ఎక్కడెక్కడ నుండియో చక్క వచ్చి
వ్రాలుచున్నవి పిట్టలు వేలు వేలు;
లేచి రా వమ్మ! మాతల్లి! లేచి రమ్ము.

౬

చదివిన పురాణపంక్తులే చదివికొనుచు
స్నాతకుండై నవిద్యార్థి చాయ జూడు;
పడుచు మగబిడ్డ యనియెడు భ్రమను తల్లి
తోట కంపుచు నున్న దెందులకొ గాని,
యెఱుగ డా చిన్నవా డామె హృదయసరణి:
లేతతులపీదళాలు చేసేత గిల్లి
నింపి కొనివచ్చు మృదుపత్ర సంపుటమ్ము;
చంపకము లెత్తికొని పోవు చతురవరుల,
తేనె వంచుక పోయెడు మానపరుల,
పత్రముల నూడ్చుకొనెడి యుపాయమతుల,
కంచె దీసి త్రోవలు సేయు వంచకులను,
తెలియగా లేదు తోట సేవలన గాచు
లేచి రా వమ్ము! మాతల్లి! లేచి రమ్ము!

౭

వదలు బంగారు బాణాలు బాలభాను
డడరి యాశావృతము లైన యెడల నెల్ల,
పూచియున్నవి పూవు లపూర్వముగను,
నిండియున్నది మధు వందు నిర్మలముగ,
సుమములను గూర్ప యోగ్య మౌ సూత్రములను
వంచి పూరింప కలధౌత పాత్రికలును,
సేకరింపగ వలె సుమీ చిన్నితల్లి!
ఇంత పూనవకము వాడనీయరాదు,
మధువునకు నూత్న పాత్ర లమర్పవలయు,
శోషితసుమాళి నిర్జీవ రూషితంబు,
ఒలికిపోయిన మధువు పుత్రులకు గాదు!
పరులు సొరకుండ గంచె గాపాడవలయు
చేరిన యనుంగులను బద్ధగౌరవమున
తోటమాలులగా జేసి తోడుకొనుము,
కలికి! తోట యందమునకుఁ గట్టుబడిన
నమ్మియుండకు గాపుదనంబు మాని;

కలకల కషాయ మాధురీ విలసనముల
నాడు నీబిడ్డపులుగుల నరయ వమ్మ;
లేచి రా వమ్మ! మాతల్లి! లేచి రమ్ము!

౧౮

వీనులకు ముద్దుగొలుపు నవీనమధుర
సుస్వరమ్ములు పాడెదు సోనలు నేడు,
మొలక లెత్తెడు ప్రక్కల మోహనముగ
నవతృణాంకుర జీవరత్నాలశయ్య;
భూసతి ప్రసూతివేదనమును గ్రహించి
చదువుచున్నార లరుణ ప్రసన్నసూక్త
లార్ద్రవర్చస్విజనము లాద్యంతములును;
సత్యసంయమ గీతా ప్రసన్న వాణి
నధ్యయనవేళ బసిపట్టి యాలకించి
యంత లంతల జేరె విహంగసమితి;
మోస లెత్తుపైరులు మేసి పోవకుండ
కణుపువిడిచెడు నందాక గాపువెట్ట
వలయు, వలయు ప్రయత్నాల మెలగరమ్మ!
అక్కచెల్లెండ్రి రాగము లతిశయింప
తల్లి తోటల గాపాడ వెళ్ళ రమ్మ!
లేచి రా వమ్మ! మాతల్లి! లేచిరమ్ము!

౯

కిన్నెరలు బాడుచున్నవి గీతములను,
కప్పురంపు దుమారముల్ గుప్పినటుల
బదిదెసల గప్పుకొనె గాఢపరిమళంబు,
పూత బడియె నశేష భూమీతలంబు
తరుణ తరుణం బయిన యొక యరుణకళను;
సుభగ తాంబూల రాగ మంచును వచింతు
రెల్ల పడుచులు వయసు పింపిళ్ళు గూయ,
వెన్నెలకరుళ్ళు నిండారు వీధినదుల
పొడుపు నవ్వుల నావలు నడుప వత్తు
రింటి నింటికి జేరువ నింపు దొరయ;
సరస కౌతుక గీతా ప్రసాద మొకడె
కలద యా నౌకయందు గావలసి నంత,
పిలిచి యిండ్లిండ్లకును పంచిపెట్టుచుంద్రు,
వలద నెడివార లెవ్వ రవ్యక్త మతులు,
ఆదరింపని వా రెవ్వ రాడువాండ్రు,
లేచి రా వమ్మ! మాతల్లి రమ్ము.

౧౦

దధిమథన మోహన ధ్వనుల్ మధురముగను
శ్రవణముల కుత్సవము జేయు సమయ మయ్యె
ఔషసి కలాప మేమఱ నగునె తల్లి!
ముసుగునం బడి యున్నది మోహవీణ
చిరనిరాదరణాహతి జెడియె నేమొ?
తలచి తాచి స్పృశించి తల్లలిత లలిత
సుశ్రుతిస్వీయ సామ్రాజ్య శోభ నింత
క్రొత్తలకు రుచి సూపించి హత్తవమ్మ;
పలుకుబడి యింపు, సన్నంపు తెలుగు కళుకు,
కలదు కల దెందు లేదని కలయ జూచి
చేత బెట్టితి నీ వీణ జిన్నదాన!
పాడితివి కొన్నినాళ్లతిస్వాదువుగను
లోక దుర్లభ మోహన పాకఫణితి
రాగరసబంధురం బైన రమ్యగీతి;
చంపకంబులు గురియ నచ్చరకొలంబు,
ఆట వెలదులు పారవశ్యంబు గొలుప,
అలరి మత్తేభలక్ష్మి కుంభాభిషేక
హృద్య సౌవర్ణ కలశము లెత్తి పట్ట,

పెరిమ బెరయంగ గరువంపు బిరుదుటందె
లడుగు దమ్ముల రారాజు లందగింప,
నిడుముత్యాలశాలల నీటు సూపి
వాసి జూరాడినట్టి నీభాగ్య మేది?
లేచి రావమ్మ! మాతల్లి! లేచి రమ్మ!

౧౧

నీటు గులుకు రాజుల చేతి నిమ్మపండు
నీ సొగసు నిట్లు కను మాయ నిదురబుత్తె?
లేచి యిపు డిప్పె నెలకూన లీల జూచు
నదిగో! సాటికన్నెల కయి యన్నికడల;
ఎచటనున్నారు? లేరు లే రిచట వారు,
ముందు బోయిరి సుముహూర్తమునకు జేర.
చిన్నవోయిన మొగముతో గన్నె యదిగో?
నిదుర లేవని మతికి నిందించి కొనుచు
ప్రసవపేటిక నావల బాఱవైచి
వంచుచున్నది భ్రూలతావదనములను,
చెదరి జాఱెడి యభిమాన చేల మైన
జక్క నొత్తక నిలచిన సకియ గనుము;
క్షీణకౌతుక యయిన ఆ చిన్నదాని
సోలి పోనీదు తల్లి నీలాల వంటి
పెన్నెరులు మోము తేట గప్పికొనకుండ
కౌగిటం గ్రుచ్చి తల్లిరో కాలుకదిపి
నూటిగా పొమ్మటంచును తోటదారి
చూపు చున్నది సుత నిక్కి సూచుచుండ,
లేచి రా వమ్మ! మాతల్లి! లేచి రమ్ము!

౧౨.

అలల రాయంచ లూగు నొయ్యారమరసి
చల్లుచున్నాడు కుంకుమాక్షతలు తరణి,
కడలు నిండ తటాయించి తొడరి పాలు
విమల జీవనదీప్రవాహమును గనుము,
పోవుచున్నది యందొక్క పూలనావ,
పడుచు లిరువురు పాటలు పాడి కొనుచు
నడుపు చున్నారు నావ నెంతయొ ప్రయాస
నెక్కడికి బోవువారొ యూహింపవమ్మ!
కడలికన్నెల మోసముల్ గడవబెట్టి,
సుడులు గుండములును గలచోట్లు వదలి,
ఎదురుగాలికి నేర్పుతో నెదురు నడపి,
పోటుపాటు వేళ లెఱింగి పాటవమున
నడుపవలె సుమ్మి యా పూలనావ వారు;
పడుచు లెఱుగ లే రుత్సాహవశత బెరసి,
సొగసు చెక్కిళ్ళు చిన్నారిసుళ్ళు దిరుగ
మాటి మాటికి నవ్వు నా నీటులాడి,
కనుల యనురాగపులకల గౌగిలించు

## తెనుగుతోట

నాపె నెడనెడ కోఘలు డాదరమున
వెలుగు గాడ్పులు కసటుగా వీచె నేని
నావలో బూలు శోషిల్లి నవయ గలవు.
మాతృపూజాముహూర్త మేమఱిరో యేమొ
లేచి రావమ్మ! మాతల్లి! లేచి రమ్మ!

౧౩

నిర్మలకుటుంబ సుపయస్వినీమతల్లి
కానల దనంత బెరిగిన కసవు మెసవి,
ప్రేమదుగ్ధమ్ము మఱపూట బిదుక దేల ?
పాలు ద్రావ బూజించెడి బ్రహ్మణులును,
మాంసము భుజింప ఖండించు హింసకులును,
ఒక్క టయి యేల గోవుల నుండనీరు
పుట్టి పెరిగిన గోష్ఠభూముల సుఖాన !
స్వాతిముత్యాల చిప్పల స్వచ్ఛ మయిన
ముత్తియము లుదయింప వేమో కుమారి !
ప్రణయరస కణములు రాలి రాలకుండ
తొణకులాడెడు స్నిగ్ధయామినులు గడచె;
మలయ పవను డెడారుల గలసినటుల
స్వాదురాగతరంగ మనాదరమున
కోనలను లంకలను గయికొనునె శాంతి ?
లేచి రా వమ్మ ! మాతల్లి ! లేచి రమ్ము!

౧౪

ఏతములు ద్రొక్కి గొరువు నీ రెత్తు వార
లన్యరతు లైరి ప్రాల్మాలి యక్కటక్కట!
పచ్చిక గుబుర్ల ముత్యాలకుచ్చు లొలయ
సకల తరుమూలములకును జలము పోవు
తోటకాల్వలు తడి లేక బీటవాఱె,
అల్లు లేక యధోగతి యందు గ్రుంగి
జాతి మాఱిన నిమ్నసంజాత మెల్ల
తాక రాదని విడిచిరి దైన్యమునకు,
పరిమళములకు వెలియైన ప్రాణలతలు
జీర్ణమయినతోటల కాపు పూర్ణమగునె?
అడ్డమైన చెట్టులనీడ లవల బోవ
వెలుగు బ్రసరించ వలయు వివేకశీల!
ప్రేమవృత్తికి జండాల భేదమేల?
బ్రాహ్మణాగ్రహారము నందు బవలు రేలు
విసరు పవనుండు కడజాతివీటియందు
తాక లేక వీచునె పక్షతంత్ర జడిమ ?
అచ్చపుబతివ్రతను శిరసావహించి

చ్యుతయశస్వినిపయి నల్కుఁ సూపగలవె
సువిమలము లైన భానుభానువులు తల్లి !
లేచి రావమ్మ ! మాతల్లి ! లేచిరమ్ము !

౧౫

గౌతమీసాంద్ర వీచికా జాతపూత
వాతపోత శీతల సముపాంతమందు
తరుణ వంశజాతముల సుస్వరము లెన్నొ
నవ్యముగ నుదయించుచున్నవి కుమారి !
కృష్ణవేణీ సరిత్కూల రేఖలందు
ప్రొద్దు తిరుగుడు పువు లభిముఖము లయ్యె,
స్నానములు సేసి, ప్రణయదుగ్ధములు ద్రావి,
పూలతోరమ్ములు ధరించి, పూర్ణభక్తి
బూజ కరిగిరి ఋషికుల పుత్రులెల్ల !
పూల పిండి పాదులలోన బ్రోగు జేసి
రంగు లీను నారతిపళ్లెరమ్మునందు
పూలు తాంబూలములు నుంచి పోవుచుండి
రకలుషవిముగ్ధ లగు కుమారికలు తల్లి !
లేచి రా వమ్ము ! మాతల్లి ! లేచిరమ్ము

౧౬

తోటనడుమన తేట పన్నీటికొలకు
కలగి కళ్మల మయ్యె దుష్కాలనిహతి,
పూచు చిన్నారి తామరపూల పైన
బాలభానుని రక్తి యభావమయ్యె;
క్రొత్తచెలు వీను కవటాకు పొత్తు లెన్నొ
కీలికీలల గప్పికో బాలు వడియె;
పూయవలసిన మొగ్గలు పూయకుండ
రాలు చున్నవి తేనెకన్నీళు లొలుక;
పూర్ణరసవతి కాని లేమొగ్గకన్నె
నేల బాధించెడి మిళింద బాలకుండు?
ఋతువిహిత ధర్మములు స్ఖలద్గతుల జెడిన
కడుపు గోతల పాపముల్ కట్టి కుడుపు,
మహితకాసారశుచి కసుమాల మయిన
జీవనం బేమిటికి సరసిజదళాక్షి!
లేచి రా వమ్మ! మాతల్లి! లేచి రమ్మ?

౧౭

లలిత సిందూర గౌరవాలంకృత మగు
నిలయ శేఖరముల రమణీయ తరుణ
తరణి కిరణతోరణ పంక్తు లరయ నమ్మ,

వన్నె వన్నెల సొగసులు బలుపు లోలయ,
తీర్చి దిద్దిన కనుముక్కు తీరు గుల్కగ,
వయసునాజూకు, నడకల వాలకంబు,
అందముల కందములు వెట్టు చందములును,
పంజరంపు నిర్బంధాల పాలుసేయు
శుకకుమారీ కులమ్ములఁ జూడ వమ్మ !

కాంత కలకంఠ సారస్య మెంతయున్న,
ఇం పయిన రూపురేక ల వెన్నియున్న,
పంజరంబుల బంధింప బడినవఱకు
శూన్య గృహదీపికలయట్లు శోభ లిడవు;

చెఱలు విడిపించి తోటల స్వేచ్ఛ గాగ
తిరుగ బంపుము చిలుక ముద్దియల, అల్ల
మోహన వనాంతరమ్ముల భోగపదవి

నలరుచున్న చిత్రగ్రీవములను గనవా!
లేచిపోవుట కలవాటు లేని సొగసు
పసపుపిట్టల కీపాప బంధమేల?
లేచి రావమ్మ! మాతల్లి! లేచిరమ్ము!

౧౭

నిండుగృహ దీర్ఘికల నున్న నీరజముల
కడుపు చల్లనిపంట నా వెడలుచున్న
మదవదళికుల సంతాన ముదయగీతి
బాడుచున్నది కర్ణోత్సవముగ నిపుడు;

రవికిరణరాగ పులకిత రభస యయిన
లసదుషఃకన్య లజ్జావిలాస వశత
జాఱు రక్తాంబరము మడు పార విప్పి
కప్పికొన జూచెడిని నలంకారసరణి;

తెరలు ద్వారాల కింక బంధింప నేల ?
దరియ వచ్చెను శుభముహూర్తక్షణంబు,
పోయి రింతకె కొంద ఱుపాయమతులు
బింబసందర్శన కుతూహలంబు కలిమి,
పరవశాదరు లయిన యూవయసు చెలులు
దరిసియుందు రీ సరికి యాత్రాస్థలంబు
లేచి రా వమ్మ! మాతల్లి! లేచి రమ్ము!

౧౯

వెన్నెలలు నిద్ర వోయెడు వేళ లయ్యె,
ఉదయసామ్రాజ్య విభవముల్ వదల లేక
మంచులగుడారముల తోడ మలగిపోవు
తారకాసంతతులు కాలధర్మనియతి;

కలికి! ప్రాచీకుమారికా కంఠమందు
మలయు కుంకుమపూవుల మాల లనగ
సొం పొలుకు చున్నయవి యుదయంపు రుచులు;
ఆడ నున్నార లోక బంతులాట నేడు
తోటలకు మధ్య నున్న సయ్యాట బయల,
నడుమ మెత్తని పచ్చిక పడకలందు
నావరించిన చెట్లచాయలకు క్రింద
విసరి విడుతురు బంతి నావేళ మొలయ;

సాటికన్నెలలో వన్నె జాఱకుండ,
చీర సింగారముల సిగ్గుచెదరకుండ,
లలిత కంఠాభరణముల్ తొలంగ నీక,
కన్నె మరియాద లెందును గలగ నీక,
వక్రమార్గాలి బంతిని వదలబోక,

సరసగతుల పందెప్పుచెండు దొరలదన్ని,
వెనుక ముందైన కన్యల ననుగు జెలిమి
తోడ రా బిల్చి గెలుపాట లాడవలయు,
లేచి రా వమ్మ! మాతల్లి! లేచి రమ్ము!

౨౦

పచ్చిపగడాలు దండలు గ్రుచ్చికొనుచు
మమత మునుకొను ప్రాతఃకుమారి తోడ
చూడ వేంచేయు భానుడు శోభ లెసగ
కాంచనద్వార దేహాళీ ఘటిత మయిన
లలితసింహాసనమ్ము నలంకరించు;

కానరాని మహర్షి లోకమ్ము లెల్ల
బలవదాశీర్వచో ముఖలలితు లగుచు
ఆట లాడిన పడుచుల నాదరించి
దర్శనం బీయగలరు వాత్సల్యరక్తి;

కందుకక్రీడ కాయత్తకాంక్షు లయిన
పూర్ణనియతలు ఇపుడిప్డె పోయినారు,
లేచి రావమ్మ! మాతల్లి! లేచిరమ్ము!

. ౨౧

దీప్తమార్గ విశాలప్రదేశమందు,
తోట బయళ్ళుల నడుమ బాహాట మైన
ద్వార మున్నది సుమ్మి! యందాలతల్లి!
త్రోవలన్నియు గలియు ప్రాక్తోరణమున
కలదు అపరంజిరెక్కల తలుపుజంట,
మూసియున్నారు పూజాప్రపూత వ్రతులు
తోట లాధీన మెడలిన నాటనుండి;
కాంచుచుందురు చిత్రలోకమ్మునందు
కళ్లెములు లేని సమదకంఖాణ ఘోర
ధావనాపాతబీభత్సదర్శనముల
క్షోభలో జిగీషాదోషచోదనమ్ము ;
వీణలెల్ల ననంత కళ్యాణగీతి
భువన సంమోహనములుగా మ్రోయ దగిన
దివ్యసమయములను గాని తెఱువరవ్వి;
ద్వారబాంధవి యప్రమాదము వహించె;
లేచిరావమ్మ! మాతల్లి! లేచిరమ్ము!

౨౨

శుచి యయిన దోయిళుల బట్టి సొనలనీరు
వదల బోవుచున్నార లావలిమహర్షు,
లాయత కుతూహలంబున నాట లాడి
జయము గానము జేయు యుష్మత్పవిత్ర
మంత్ర పుష్పోక్తి యీలోన మానిజనుల
కర్ణపూర్ణోత్సవము జిలుకంగ వలయు;

మిమ్ము గ్రమ్మిన నూత్న రాగమ్ము కళలు
మీరు పాడిన మంగళామేయగీత
లవ్వలి పవిత్రబింబము నంద గలవు,

రాగమయ మైన జీవనభోగ మరసి
బంధమోక్షణ చక్రవిభ్రమణ మనుచు,
మధురవకుళ ప్రసవ నూత్న మధు వటంచు,
పాలు నెత్తురుగా భ్రమపడితి మనుచు,
నీరు పా లంచు దెలియగా నేర మనుచు,
త్రొక్కు లాడుచు దిగ్భ్రాంతి దూగు వేళ;

ద్వారపాలిక భాగ్య కవాటములను
తెఱువ గల దవశ మ్మగు పరవశమున;
లేచి రా వమ్మ! మాతల్లి! లేచి రమ్ము!

౨౩

దివ్యసంతతి కెలన భక్తిఁ భజింప
ప్రేమసామ్రాజ్యపాలనా ప్రీణ యగుచు
నిండు గొలువు తీర్చెడి రమణీయమూర్తి,
రాజరాజేశ్వరి కుమారరక్తి మధుర,
స్తన్యమోహాంధ యగుచు సాక్షాత్కరించు;

అరసి యర్చింపు మాజగదంబనపుడు
స్నేహదీపము వెలిగించి చిత్రపీఠి,
పసుపు గుంకుమ పూవులు కొసరి చల్లి,
చిన్ని కర్పూరహారతి చేతబట్టి
పాడవమ్మ! తెనుగుబాణి ప్రేమయజగము

తన్మయ స్తవమధు నివేదనముకలన
బరవశ ప్రసన్నావధిఁ బడయుఁబ్రకృతి;

తత్తదవ్యయశుభముహూర్తంబునందు
'ఆంధ్రకళ్యాణ' మనుచు బ్రహ్మాండమెల్ల
తానమాడు నపర్యుషితంపు శ్రుతిని ;
ఆదరమున తథాస్తుతథాస్తటంచు

తె ను గు తో ట

ఋషులు ఋషిపత్నులును వచియింపగలరు ;

ఆంధ్ర బాలకు పూర్ణకళ్యాణ మవును
నిదుర లేవమ్మ ! మాతల్లి నిదుర లెమ్మ !




ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల: బెజవాడ

రాయప్రోలు
సుబ్బారాయ కృతులు



తృణ కంకణము

కష్ట కమల

స్నేహలతా దేవి

తెనుగు తోట

స్వప్న కుమారము

ఆంధ్రావళి

జడ కుచ్చులు

మధు కలశము

రమ్యాలోకము

అర్ధ రూపాయి